విడిపత్రిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 103224 నవంబరు 14 వ తేది 1935 గురువారము అర్ధ సం॥ చందా రూ. 3

సంపుటము ౧౦. | తూర్పుబజారు, హైదరాబాదు - దక్కన్. | శా. శ. ౧౮౫౭ శ్రీ యువ సం॥ కార్తీక బ॥ ౮ గురువారము. హి॥ ౧౩౫౪ ష. | సంచిక ౫౧

## ఇండియాలో కర్షకుల ఋణము, దాని విమోచన.

మొహియుద్దీన్ గారు

### సహకారోద్యమపు తెప్పలడుగు

భారతదేశములో వ్యవసాయకుడు పుట్టునప్పుడే అప్పులభారముతో పుట్టుచున్నాడు. యావజ్జీవము యీబాధ ననుభవించి ఋణదశలోనే మరణించుచున్నాడు. అమెరికాదేశమందు సామాన్య కృషీవలుడు భూమియొక్కస్థితిని బాగుపరచుట, యంత్రములకొనుట మొదలగువానికై అప్పుతెచ్చి ఆదాయమును వృద్ధిజేసికొనుచుండ, హిందూదేశములో దాదాపు కృషీవలులుజేసిన ఋణమంతయు పెండ్లికో లేక మఱియే సంప్రదాయసిద్ధమగు ఆచారమాత్రమైన శుభాశుభ కార్యములకో యింటిఖర్చులకో, లేక వ్యాజ్యములు వ్యవహారములకో తేబడినట్టిదై, వారల ఆదాయమునకు వృద్ధినిచ్చునది మాత్రము కాకయున్నది. ఆదాయవృద్ధి కుపకరించనట్టి ఋణములపై తదితరములగు ఋణములపై విధించబడు వడ్డీకంటె యెక్కువవడ్డీ విధించబడును. అమెరికాదేశమందు కృషీవలునికి నూటికి సంవత్సరమునకు ౬ మొదలుకొని ౧౦ లోపల వడ్డీచొప్పున ఋణము పుట్టుచుండ యిండియాలో వ్యవసాయకుడు నూటికి సంవత్సరము ౧౨-౧౫ మొదలుకొని ౩౭ వరకు వడ్డీని చెల్లించవలసివచ్చుచున్నది. భూమియున్నవారు చేయుఅప్పులో అత్యధికభాగము వారల ఆదాయమును యేవిధమునగాని వృద్ధిచేయుట కుపయోగపడకుండుటయే యిండియాదేశములో యితరదేశములలో విధించబడువడ్డీకంటె యెక్కువ విధించబడుచుండుటకును, సామాన్యముగ ప్రతిరైతును అతిభారమగు ఋణమున తగుల్కొనియుండుటకును ప్రధానకారణము.

ఇండియాలో ఋణములవలన ఆదాయము యెక్కువగునట్లు చేయుట సహకారోద్యమములో నున్నవారిపని. సహకారోద్యమాభిప్రాయము తక్కువవడ్డీకి అప్పులనిచ్చుట మాత్రమే గాదు. తక్కువవడ్డీకి అప్పులనిచ్చి తమ ఉద్దేశమంతయు నెరవేరినదని సహకారవాదులెన్నటికిని తలచరాదు. చేయబడిన అప్పు కొద్దిగడువులో తీర్పవలసినదైనను, దీర్ఘావధిగలదైనను—దానివలన ఆ అప్పుచేసినవాని ఆదాయము వృద్ధిజెందిననేగాని దానినతడు తీర్పజాలడని ప్రతి కృషీవలునికిని బోధపడిననాడే యీ సహకారోద్యమము జయముగాంచుటయు; వ్యవసాయకుడు సంపన్నుడగుటయు సాధ్యములు.

### పంజాబులో స్థితి

పంజాబు రాష్ట్రమందు డార్లింగుగారును భారతదేశమందలి రాష్ట్రములందును "సెంట్రల్ బ్యాంకింగ్ యెంక్వైరీకమిటీ" తమ కమిటీయొక్క తత్తద్రాష్ట్రీయశాఖలును యీ కృషీవలుల ఋణభారమునుగూర్చి విచారించిరి. విచారించినంతవరకు పంజాబులో తేలినదేమనగ భూమియున్నవారిలో ప్రతియొకనికి సా॥ ౪౬౩ లు అప్పుఉండెను. ఎవరెవరి అప్పులస్థితిగూర్చి విచారణ చేయబడెనో వారందరి అప్పుల మొత్తములన్నియు కలుపగా, వారలు ఒక్కొక్కరు కట్టు భూమిపన్ను మొత్తములనన్నింటిని కలిపిన యెంతయగునో అంతకు పండ్రెండింతలుండెను. తక్కినరాష్ట్రములలోను యిట్లే యుండెనని చెప్పలేము. అసలు నిజముగా ఋణభారమెంతయో నిర్ణయించుటకు ముందే భూమిసారమెంతయో, అప్పుజేసినవానిపోషణలోనుండు కుటుంబమెంతవో, ఆకుటుంబమందు వారు సాధారణముగ యేమాత్రపుదర్జాలో నుందురో—యిట్టి లక్షణములుగల విశేషములను కనుగొనవలసియుండును.

### నిజాంరాష్ట్రస్థితి

మన యీరాష్ట్రములో (నిజాం రాష్ట్రములో) ఒక్కొక్క పట్టాదారుని ఋణభారమెంతయో నిర్ణయించుటకు నవ్వునగిన ఆధారమేదియును (అనగా విచారించికనుగొనిన అంకెలు) లేవు. ఈవిషయములో దొరకు ఆధారము కేశవ అయ్యంగారు, ఆర్థికపరిశీలనచేసి చేసియున్న నివేదికయొకటేయిప్పటికి కనుపించుచున్నది కాని యీనివేదికలో లభించుసంఖ్యలు బ్రిటిషు యిండియాలోని రాష్ట్రములనుగూర్చిన అంకెలతో పోల్చిచూచి మన స్థితి యిట్లున్నదని చెప్పుటకు కొంతకు కొంతయేగాను. ఉపయోగించునవికావు. ఎత్తుకోగనే మొత్తుకోళ్ళన్నట్లు ఆరంభమందు భూమిని రహనుపెట్టి తెచ్చిన అప్పులనియు, తద్భిన్నములగు ఋణములనియు ఒకభేదము చేయబడినది.

ఇందుచే భూమిగలవారికుండు రెండు రకముల అప్పులకలిసిన అగు మొత్తమెంతయో ఊహించవీలుగాకున్నది. పైనివేదిక ఉపయోగించుటకు అందుండు రెండవలోపమేమనగ, భూమి రహనుపెట్టకయే తేబడినఅప్పు పరిశీలించబడిన గ్రామములలో నివసించు అన్ని కుటుంబములకునూ—వారలకు భూమియున్నను లేకున్నను చూపబడినది. ఎవరి అప్పులస్థితినిగూర్చి విచారించబడెనో వారందరిలోను పట్టాదారులు ౧౦౦కి ౬౧ మందిమాత్రమే. ఇక్కడనైనను సామాన్యముగా ప్రతిపట్టాదారునికింతయప్పున్నదని చెప్పుటకు యింతయుండవచ్చునని ఊహచే చెప్పవలసినదేగాని గట్టియాధారమేదియులేదు. మూడవలోపమేమనగ, భూమిపన్నుకంటె ఋణమెన్నింతలో అందు లేదు.

### భూమితనఖాలేని అప్పులు

ఈలోపములను మనసులోబెట్టుకొని నేనిప్పుడు అప్పులభారమును సూచించు అంకెలను తెలియబఱచెదను. మొదట భూమి తనఖాలేని అప్పులనుగూర్చి తెలిపెదను. ఈరాష్ట్రమందు ఆరుజిల్లాలు—నిజామాబాదు, నాందేడు, వరంగల్లు, ఔరంగాబాదు, రాయచూరుజిల్లాలు—పరిశీలించబడినవి. ఆజిల్లాలలోను ౫౬౭౦ కుటుంబములనుగూర్చి మాత్రమే విచారించబడెను. వీటిలో ___ భూమితనఖాగల అప్పును మాత్రము వదలివేసి లెక్కించిన—౨౬౯౫ కుటుంబములు ఋణగ్రస్తములని కనుగొనబడెను అనగా పరిశోధించబడిన కుటుంబములన్నింటి మొత్తములో నూటికి ౪౭ వంతున అప్పులపాలైయుండెను. కాని పై ౫౬౭౦ కుటుంబములలో కూలిపనివాండ్రు మొదలగు భూమిలేనివారందరును చేరియున్నారు. అప్పులపాలైన వారిలో చాలమంది భూమిగలవారే యుండవచ్చునుకాబట్టి పట్టాదారులలో నూటికి ౫౦ మొదలుకొని ౬౦ వరకు ఋణగ్రస్తులని పరిగణింపవచ్చును. ఈ అంకెలు ౧౯౨౯-౩౦ సం॥ము నాటివి. ఆర్థికదుస్థితి అప్పుడుస్న్నిలిచే రైతులెన్నియో కష్టములనుభవించిరి. అంతేకాదు యెట్లో కాలముగడపినవారుకూడ అప్పుడు అప్పుచేయక తప్పినదికాదు అందుచే ఋణగ్రస్తులగు భూస్వాముల సంఖ్య పెరిగియుండవచ్చును. నూటికి ౬౦ మంది పట్టాదారులవంతున ఋణగ్రస్తులని లెక్కించినను పంజాబులో నూటికి ౮౩ వంతున పట్టాదారులు ఋణగ్రస్తులని లెక్కకు దిగి సరిపోవును. ఇట్లు పంజాబులో నూటికి ౧౭ మంది వంతునమాత్రమే ఋణబాధలేనివారైయుండ మన హైదరాబాదు రాష్ట్రములో నూటికి ౪౦ మంది పట్టాదారులు ఋణబాధలేనివారు. ఇది సంతృప్తికరమగు అంశమే.

### అప్పు మొత్తము

ఇక యెంతఅప్పున్నదో చూతము. ఋణగ్రస్తములుగ కనబడిన ౨౬౯౫ కుటుంబములకును కలిపి మొత్తము రూ. ౬,౧౯,౬౦౦ లు అప్పుండెను. ఇది భూమితనఖాలేని అప్పు. అప్పుపాలైన ప్రతియొక కుటుంబమునకు సరాసరిన రూ. ౨౩౦లు అప్పుండెనని అర్థము. అప్పులపాలైన కుటుంబములలో పట్టాదారులుకాని కుటుంబములుగలవని నేనివరకే చెప్పియుంటినిగదా! ఈ చర్చయొక్క ఉద్దేశ్యము హెచ్చుతగ్గులవలని సరాసరిన ప్రతియొక పట్టాదారునికి, యెంతఅప్పుగలదో కనుగొనుటయే గావున నేను దానిని ఊహచే అంచనావేసిచూచెదను. పట్టాదారులసంఖ్య పరిశోధించబడిన కుటుంబముల సంఖ్యలో యెంతభాగమగుచున్నదో (నూటికి ౬౧ వంతున అగుచున్నది) అప్పులపాలైన కుటుంబముల సంఖ్యలో కూడ నంతేభాగమగుననుకొందము. ఈ లెక్కపై అప్పులపాలైన పట్టాదారులసంఖ్యను కనుగొన్నచో [అనగా అప్పులపాలైన ౨౬౯౫ కుటుంబములలో నూటికి ౬౧ వ వంతు]—అది ౧౬౪౪ అగును. శాశ్వతమైన ఆస్తిలేని కుటుంబములకు వేటికిగాని బనియాలు అప్పులీయరు కాబట్టి యీసంఖ్య యింతకంటె హెచ్చుగానేనుండును. ఎట్టి ఆస్తియులేని ఋణగ్రస్తకుటుంబములసంఖ్య ఏదోకొంత ఆస్తిగల్గి ఋణగ్రస్తులైన కుటుంబములసంఖ్యకంటె తక్కువగనే యుండును. ఇది నాదృష్టిలో నుంచుకొనియే నేను లెక్కించితిని. భూమితనఖాలేని అప్పు రూ. ౬,౧౯,౬౦౦ లెందులో నూటికి ౬౧ వంతునగాక, ౭౫ వంతున భూస్వాములకు జెందినదని మనము ఊహించుటకు గొప్ప ఆక్షేపణ యేమియులేదని నేను తలచెదను. పైన యివ్వబడిన రూ. ౬,౧౯,౬౦౦ లలో నూటికి ౭౫ వంతున లెక్కించిన రూ. ౪,౬౪,౭౦౦ వచ్చును. ఈసంఖ్యను పట్టాదారుల సంఖ్యచే అను ౧౬౪౪ చే భాగించిన అప్పులపాలైన ప్రతిపట్టాదారునికి సరాసరిన రూ. ౨౮౨ ల అప్పు ఉన్నట్లు తేలును. ఇందులో భూమితనఖా అప్పుచేరలేదు. భూమితనఖాగల అప్పును లెక్కించునప్పుడు, మహబూబునగరు, నిజామాబాదు జిల్లాలలో తేబడిన అంకెలు మనకంత లెక్కించదగినవికావు కాబట్టి వాటినివదలవచ్చును. తక్కిన నాలుగు జిల్లాలలో [నాందేడు, వరంగల్లు, ఔరంగాబాదు, రాయచూరు] ౪౪ గ్రామములలో ౩౩౩౩ కుటుంబముల స్థితిగతులు కనుగొనగా ౩౭౬ కుటుంబములు భూమితనఖాఅప్పులలో చిక్కుకొనియున్నట్లును, రూ. ౧,౮౭,౨౪౮ ల వరకు తనఖాగల అప్పు ఉన్నట్లును తేలెను. అప్పులలో ఒకటే రెండుమూడు తనఖాలను గూడ పెట్టియుండెను. ఈచిన్నను లెక్కించక చూచినచో ఒక్కొక్క కుటుంబము పోలేకి రూ. ౪౯౭ల అప్పుయేర్పడుచున్నది. భూమి, తరీ కుష్కీ కలుపుకొని యెకరము ౧ కి సరాసరిన రూ. ౩౯ ల అప్పుఉన్నట్లైనది

౧౨ వ పేజి తరువాయి

## గమనిక

ఈసంవత్సర ౧౯౩౫ అక్టోబరు ౨౭ వ తేదీనాడు సర్ అక్బర్ హైదరీగారి అధ్యక్షతన యీ హైదరాబాదు నగరమున జరిగిన హైదరాబాదు యికనమిక్ అసోసియేషన్ సమావేశములో మొహియుద్దీన్ గారిచే చదువబడిన వ్యాసముయొక్క సారము

(హైదరాబాదు బులెటిన్ పత్రికనుండి తెనిగింపబడినది)